# పోతన తెలుగు భాగవతము


## సంకలనం : ఊలపల్లి సాంబశివ రావు.


## కుంతి స్తుతి (ఆపద హరం) – ప్రథమ స్కంధము

1

"పురుషుం, డాఢ్యుఁడు, ప్రకృతికిఁ

బరుఁ, డవ్యయుఁ, డఖిలభూత బహిరంతర్భా

సురుఁడును, లోకనియంతయుఁ,

బరమేశ్వరుఁడైన నీకుఁ బ్రణతులగు హరీ!

2

మఱియు జవనిక మఱుపున నాట్యంబు సలుపు నటుని చందంబున మాయా యవనికాంతరాళంబున నిలువంబడి నీ మహిమచేఁ బరమహంసలు నివృత్తరాగద్వేషులు నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండ వయి పరిచ్ఛిన్నుండవు గాని, నీవు మూఢదృక్కులుఁ గుటుంబవంతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశచరణ! హృషీకేశ! భక్తియోగంబునం జేసి నమస్కరించెద నవధరింపుము.

3

తనయులతోడ నే దహ్యమానంబగు;

జతుగృహంబందునుఁ జావకుండఁ

గురురాజు పెట్టించు ఘోరవిషంబుల;

మారుతపుత్త్రుండు మడియకుండ

ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ;

ద్రౌపదిమానంబు దలఁగకుండ

గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే;

నా బిడ్డ లనిలోన నలఁగకుండ

విరటుపుత్త్రిక కడుపులో వెలయు చూలు

ద్రోణనందను శరవహ్నిఁ ద్రుంగకుండ

మఱియు రక్షించితివి పెక్కుమార్గములను

నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష!

4

బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ

తల్లిఁ గాచిన భంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ

దల్లడంబునఁ జిక్కకుండఁగఁ దావకీన గుణవ్రజం

బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన, జగత్పతీ!

5

జననము, నైశ్వర్యంబును,
ధనమును, విద్యయునుఁ, గల మదచ్ఛన్ను లకిం
చనగోచరుఁడగు నిన్నున్
వినుతింపఁగ లేరు, నిఖిలవిబుధస్తుత్యా!

6

మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామ విషయుండును, నాత్మారాముండును, రాగాదిరహితుండునుఁ, గైవల్యదాన సమర్థుండునుఁ, గాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకల భూత నిగ్రహానుగ్రహకరుండును నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము; మనుష్యుల విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు నీకుం బ్రియాప్రియులు లేరు జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవుల యందు వరాహాది రూపంబులను మనుష్యు లందు రామాది రూపంబులను ఋషుల యందు వామనాది రూపంబులను జలచరంబుల యందు మత్స్యాది రూపంబులను నవతరించుట లోకవిడంబనార్థంబు గాని జన్మకర్మసహితుం డవగుటం గాదు.

7

కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో
గోపిక ద్రాటఁ గట్టిన వికుంచిత సాంజన బాష్పతోయ ధా
రాపరిపూర్ణ వక్త్రముఁ గరంబులఁ బ్రాముచు వెచ్చనూర్చుచుం
బాపఁడవై నటించుట కృపాపర! నా మదిఁ జోద్య మయ్యెడిన్.

8

మలయమునఁ జందనము క్రియ
వెలయఁగ ధర్మజుని కీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు
కులమున నుదయించె నండ్రు గొంద, అనంతా!

9

వసుదేవదేవకులు తా
పసగతి గతభవమునందుఁ బ్రార్థించిన సం
తసమునఁ బుత్త్రత నొందితి
వసురుల మృతి కంచుఁ గొంద అండ్రు, మహాత్మా!

10

జలరాశి నడుమ మునిగెఁడు
కలము క్రియన్ భూరిభారకర్శితయగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ
గలిగితి వని కొంద అండ్రు, గణనాతీతా!

11

మఱచి యజ్ఞాన కామ కర్మములఁ దిరుగు

వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ

శ్రవణ చింతన వందనార్చనము లిచ్చు

కొఱకు నుదయించి తండ్రు నిన్ గొంద అభవ!

12

నినుఁ జింతించుచుఁ బాడుచుం బొగడుచున్ నీ దివ్యచారిత్రముల్

వినుచుం జూతురుగాక లోకు లితరాన్వేషంబులం జూతురే

ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై మహాయోగి వా

గ్వినుతంబైన భవత్ప దాబ్జయుగమున్ విశ్వేశ! విశ్వంభరా!

13

దేవా! నిరాశ్రయులమై భవదీయ చరణారవిందంబు లాశ్రయించి నీ వారల మైన మమ్ము విడిచి విచ్చేయ నేల, నీ సకరుణావలోకనంబుల నిత్యంబునుఁ జూడవేని యాదవసహితులైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబుల చందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణ లక్షణ లక్షితంబులయిన నీ యడుగులచేత నంకితంబైన యీ ధరణీమండలంబు నీవు వాసిన శోభితంబుగాదు; నీ కృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమ ఫలభరితంబులై యోషధి తరు లతా గుల్మ నద నదీ సమేతంబులై యుండు.

14

యాదవు లందుఁ బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహవి

చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ

పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న

త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁ గదయ్య! యీశ్వరా!

15

శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!

లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా

నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!

నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!

16

అని యిట్లు సకలసంభాషణంబుల నుతియించు గొంతిమాటకు నియ్యకొని, గోవిందుండు మాయా నిరూఢ మందహాస విశేషంబున మోహంబు నొందించి రథారూఢుండై కరినగరంబునకు వచ్చి కుంతీసుభద్రాదుల వీడ్కొని, తన పురంబునకు విచ్చేయ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలువు మని ప్రార్థితుండై, నిలిచె; నంత బంధువధశోకాతురుం డయిన ధర్మజుండు నారాయణ వ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుండై నిర్వేకం బగు చిత్తంబున నిట్లనియె.

చదువుకుందాం భాగవతం. బాగుపడదాం మనమందరం....

# భీష్మస్తుతి (భక్తి ప్రదం) – ప్రథమ స్కంధము

1

ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి తత్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూత శరవ్యధా నిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలం బొప్ప నుతించెఁ గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్.

2

ఇట్లు పీతాంబరధారియుఁ జతుర్భుజుండు నాదిపూరుషుండు బరమేశ్వరుండు నగు హరియందు నిష్కాముండై విశుద్ధం బగు ధ్యానవిశేషంబుచే నిరస్తదోషుఁ డగుచు ధారణావతియైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది ప్రకృతివలన నైన సృష్టిపరంపరలఁ బరిహరించు తలపున మందాకినీ నందనుం డిట్లనియె.

3

"త్రిజగన్మోహన నీలకాంతిఁ దను వుద్దీపింపఁ బ్రాభాత నీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

4

హయరింఖాముఖ ధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమ తోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చువేడ్క నని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.

5

నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలో
బరు లీక్షింప రథంబు నిల్పి పరభూపాలావళిం జూపుచుం
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై.

6

తనవారిఁ జంపఁజాలక
వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘన యోగవిద్యఁ బాపిన
మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్.

7

కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి;

గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ;

నుఱికిన నోర్వక యుదరంబులో నున్న;

జగముల వ్రేఁగున జగతి గదలఁ;

జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ;

బైనున్న పచ్చనిపటము జాఱ;

నమ్మితి నాలావు నగుఁబాటు సేయక;

మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ;

గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి

నేఁడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు

విడువు మర్జున యనుచు మద్విశిఖ వృష్టిఁ

దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

8

తనకున్ భృత్యుఁడు వీనిఁ గాఁచుట మహాధర్మంబు వొమ్మంచు న

ర్జునసారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్

మునికోలన్ వడిఁ బూని ఘోటకములన్ మోదించి తాడించుచున్

జనులన్మోహము నొందఁ జేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్.

9

పలుకుల నగవుల నడపుల

నలుకల నవలోకనముల నాభీరవధూ

కులముల మనముల తాలిమి

కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్.

10

మునులు నృపులుఁ జూడ మును ధర్మజుని సభా

మందిరమున యాగమండపమునఁ

జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది

దేవుఁ డమరు నాదు దృష్టియందు.

11

ఒక సూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో

లిక నే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ

న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ

పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై."

చదువుకుందాం భాగవతం. బాగుపడదాం మనమందరం....